

# బస్రా నావికుడు

బస్రాలో పూర్వం అబుల్ ఫవారిస్ అనే వాడుండేవాడు. అతను ఆ నగరంలోని నావికులందరికీ పెద్ద. సముద్రాల మీద అతను చూడని రేవు లేదని చెప్పుకునేవారు.

ఒకనాడు అబుల్ ఫవారిస్ సముద్ర తీరాన తన కళాసుల మధ్య కూర్చుని ఉండగా ఒక వృద్ధుడు అతని వద్దకు వచ్చి, "నీ ఓడను ఆరు నెలలపాటు బాడుగకు తీసుకుంటాను. కిరాయి ఎంతో చెప్పు," అని అడిగాడు.

"వెయ్యి బంగారు దీనారాలు ఇవ్వండి," అన్నాడు నావికుడు అబుల్ ఫవారిస్.

వృద్ధుడు వెంటనే అతనికి అంత సొమ్మూ ఇచ్చి, "రేపు మళ్ళీ వస్తాను, మాట తప్పితే ఊరుకోను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

నావికుడు ఆ డబ్బు తీసుకుని ఇంటికి వెళ్ళి, తన ఓడను ప్రయాణానికి సిద్ధం చేసి, తన భార్యకూ, బిడ్డలకూ వీడ్కోలు చెప్పి రేవుకు వచ్చాడు. అక్కడ ఆ వృద్ధుడు అతని కోసం ఎదురు చూస్తున్నాడు. వృద్ధుడి వెంట ఒక బానిసా, అనేక ఖాళీ గోనె సంచులూ ఉన్నాయి.

అబుల్ ఫవారిస్ సహాయంతో సంచు లన్నిటినీ ఓడలో చేర్చి, వృద్ధుడు తన బానిసతోసహా ఓడలోకి ఎక్కాడు. ఓడ రేవు నుంచి బయలుదేరి ఒకే దిక్కుగా మూడు నెలలు ప్రయాణం చేసి ఒక లంకను చేరింది. వృద్ధుడు చుక్కాని వద్ద కూర్చుని ఓడను తిన్నగా లంకకు నడిపాడు.

ఓడ తీరాన్ని తగలగానే లంగరు దింపారు. వృద్ధుడు తన బానిస నెత్తిన కొన్ని గోతాలు పెట్టి, అబుల్ ఫవారిస్‌ను వెంట పెట్టుకుని, లంక మీదికి బయలుదేరాడు.

కొద్ది గంటలసేపు నడిచి వారొక కొండను చేరుకున్నారు. వాళ్ళు కొండ మీదికి ఎక్కారు. అక్కడ విశాలమైన సమప్రదేశం





"ఈ గుంటలలోకి ముత్యపుచిప్పలు ఎలా వచ్చాయి?" అని నావికుడు వృద్ధుణ్ణి అడిగాడు.

"ఈ గుంటలకూ సముద్రానికి మధ్య సొరంగా లున్నాయి. వాటికుండా గుల్ల చేపలు వచ్చి ఈ గుంటలలో చేరుతాయి. మనిషి సహాయంకోసం నిన్ను వెంట తెచ్చాను. అందుచేత ఈ రహస్యం మరెవరికీ తెలియనివ్వకు," అన్నాడు వృద్ధుడు.

నావికుడు ఆత్రంగా గుంటలోకి దిగాడు. దాని అడుగున ఎన్నో ముత్యపు చిప్ప లున్నాయి. వృద్ధుడు తాళ్ళు కట్టి తట్టను దింపి, చాలాసార్లు ముత్యపుచిప్పలను పైకి తోడుకున్నాడు. చివరకు ఆయన, "ఇంక ముత్యపుచిప్పలు తీయకు. వీటిలో ఒక్క ముత్యం కూడా లేదు. అన్నీ ఉత్త గుల్లలు," అని కేకపెట్టాడు.

అబుల్ ఫవారిస్ ఆ గుంటలో నుంచి పైకి వచ్చి, మరొక గుంటలోకి దిగాడు. అందులో అంతులేని ముత్యపుచిప్ప లున్నాయి. చీకటి పడేదాకా అతను వాటిని తట్టలో పోసి, వృద్ధుడికి అందించి, తెగ అలిసిపోయి, "ఇక నాకు శక్తి లేదు. నన్ను పైకి లాగు," అని కేక పెట్టాడు.

కనిపించింది. అందులో రెండు వందలకు పైగా, లోతైన పెద్ద పెద్ద గోతులు తవ్వ బడి ఉన్నాయి.

వృద్ధుడు అబుల్ ఫవారిస్‌తో, "నీకొక రహస్యం చెబుతాను. దాన్ని నీ మనసులోనే ఉండనీ. నేకొక వర్తకుణ్ణి. ఈ ప్రదేశంలో నేనొక పెద్ద-రత్నాలనిధి కనిపెట్టాను. నువు నాకొక ఉపకారం చెయ్యాలి. ఈ గోతిలోకి దిగి ముత్యపుచిప్పలు తోడు. ఈ సంచు లన్నీ నించుకుందాం. వీటిలో సగం నీకూ, సగం నాకూనూ. వీటితో మన ఇద్దరి జీవి తాలూ మహారాజు లాగా వెళ్ళిపోతాయి," అని చెప్పాడు.





"నువు ఆ గుంటలోనే ఉండు. నిన్ను పైకి తీసినాక నువు నన్ను ముత్యాల కోసం చంపేస్తావేమో! నాకేమిటి నమ్మకం?" అన్నాడు వృద్ధుడు.

"నాకు అలాటి ఆలోచన ఏ కోశానా లేదు. నా మాట నమ్ము!" అని అబుల్ ఫవారిస్ కేకలు పెట్టాడు. కాని వృద్ధుడు వినిపించుకోకుండా కొండ దిగి వెళ్ళిపోయి, రేవు చేరి, ఓడలో ప్రయాణమయాడు.

అబుల్ ఫవారిస్ ఆ గోతిలో మూడు రోజులు గడిపి, ఆకలి దప్పులతో చాలా బాధ పడ్డాడు. అతను బయట పడటానికి కారాడు తూంటే అతనికి మనుషుల ఎముకలు అనేకం తగిలాయి. వృద్ధుడు తనను మోసం చేసినట్టే ఇంకా చాలామందిని మోసగించా డన్నమాట!

అబుల్ ఫవారిస్ ఉత్త చేతులతో గుంట చుట్టూరా మన్ను పీకి చూస్తూంటే ఒక చోట చిన్న ద్వారం ఉన్నట్టు తోచింది. దాన్ని చేతులతోనే పెద్దది చేసిన మీదట అతను దూరేపాటి దారి కనబడింది. దాని కుండా అతను పాకుతూ వచ్చి, కొంత సేపటికి మెడ లోతు నీటిలో పడ్డాడు. చీకటిలో ఏమీ కనిపించలేదు. నీరు నోటికి ఉప్పగా ఉన్నది. ఆ నీటిలో ఈదుకుంటూ



మరి కొంతదూరం పోయాక దూరాన కొద్ది కాంతి కనబడింది. అతనికి ప్రాణం లేచి వచ్చినట్టయింది. అది అతడున్న సొరంగానికి వెలపలి ద్వారం.

ఆ సొరంగాన్ని గడిచి అబుల్ ఫవారిస్ సముద్రతీరం చేరుకున్నాడు. అతను నీటి ఒడ్డున కూర్చుని తన గతి ఇలా అయి నందుకూ, ముందు ఏమి కానున్నదో అనీ విచారించసాగాడు.

అతను సముద్రం మీదికి చూస్తూ ఉండగా ఏదో ఓడ అతని కనుచూపుమేర లోకి వచ్చింది. దాని నిండా మనుషు లున్నారు. అతను చివాలున లేచి నిలబడి,

నెత్తి మీది తలపాగా తీసి, గాలిలో ఎగర వేస్తూ గొంతు చించుకుని కేకలు పెట్టాడు.

ఓడ అతని కేసి రాసాగింది. తనకు కలిగిన అనుభవం గురించి ఆ ఓడలోని వాళ్ళకు చెప్పరాదని అతను నిర్ణయించు కున్నాడు. ఓడ అతని సమీపంలో ఆగి, అతన్ని ఎక్కించుకున్నది.

"ఈ లంకకు ఎలా చేరావు?" అని ఓడలో ఉన్నవాళ్ళు అతన్ని అడిగారు.

"నేనెక్కిన ఓడ సముద్రం మీద పగిలి పోయింది. ఒక కొయ్యపలక ఆధారంతో తేలి, ఇక్కడికి కొట్టుకు వచ్చాను," అన్నాడు అబుల్ ఫవారిస్. ఓడలోవాళ్ళు అతని అదృష్టాన్ని కొనియాడారు.

"మీ ప్రయాణం ఎక్కడి నుంచి ఎక్కడికి?" అని అబుల్‌ఫవారిస్ వారిని అడిగాడు.

"మేము అబిసీనియా నుంచి వస్తున్నాము. మేము వెళుతున్నది హిందూస్తానుకు," అన్నారు వాళ్ళు.

"నాకు హిందూస్తానానికి వెళ్ళే పని ఏమీ లేదు," అన్నాడు అబుల్ ఫవారిస్ సంకోచంగా.

"నీకు సంకోచం అవసరం లేదు. మాకు బస్రా పోయే ఓడలు ఎన్నో ఎదురు వస్తాయి. ఏదో ఒక ఓడలో ఎక్కించి నిన్ను బస్రా చేర్పిస్తాము," అన్నారు ఓడవాళ్ళు.

వాళ్లు ఆ మాట అన్న మీదట అబుల్ ఫవారిస్ వారి ఓడలో ప్రయాణం చెయ్యటానికి సమ్మతించాడు.

ఆ ఓడ నలభైరోజులు సముద్రం మీద ప్రయాణించినా ఒక్కసారి కూడా తీరం తగలలేదు. "మీరు దారి తప్పలేదు గద?" అని అబుల్‌ఫవారిస్ ఓడవాళ్ళను అడిగాడు.

"అయిదు రోజులుగా ఓడ ఎటు పోతున్నదీ మాకే అంతు చిక్కటం లేదు," అని ఓడవాళ్ళు నిజం బయటపెట్టారు!

ఆ తరవాత అందరూ చాలాసేపు ప్రార్థనలు చేశారు. —(ఇంకా వుంది)





# బస్రా నావికుడు

## 2

మరికొంతసేపటికి ఓడలోని వారికి వింతలు కనపడ్డాయి. సముద్రంలో నుంచి ఒక స్తంభం లాటిది పైకి వచ్చినట్టు కనబడింది. ఏదో మెరుపులాటిది మెరిసింది. ఇంతకన్న చిత్రమేమంటే, ఎవరూ తెడ్డు వెయ్యకుండానే, గాలి వీచకుండానే, ఓడ దానంతట అది అతివేగంతో ప్రయాణిస్తున్నది.

ఓడలోనివాళ్ళు ఆశ్చర్యపడి, అబుల్ ఫవారిస్ వద్దకు వచ్చి, "మన ఓడ దానంతట అదే ఇలా శరవేగంతో నీటిమీద కదలటానికి కారణం ఏమై ఉంటుంది?" అని అడిగారు.

అబుల్ ఫవారిస్ కళ్ళెత్తి చూశాడు. అతనికి దూరాన ఒక కొండ కనిపించింది. అది సముద్రంలో నుంచి పైకి పొడుచుకు వచ్చింది. దాన్ని చూసి అతను బాధతో పెద్దగా మూలిగి, చేతులతో కళ్ళు మూసుకుని, "చచ్చాం!" అంటూ గట్టిగా అరిచాడు.

తరవాత అతను ఓడలోని వాళ్ళతో ఇలా అన్నాడు;

"సముద్రం మీద ఎప్పుడైనా దారి తప్పటం జరిగితే చుక్కాని తూర్పుకేసి పట్టమని మా నాన్న అంటూండేవాడు. ఎందుకంటే, ఓడ పడమరకేసి పోతే అది 'సింహం నోరు' వాత పడటం తప్పనిసరి అని ఆయన అనేవాడు. 'సింహం నోరు' ఏమిటని ఆయనను అడిగాను. సముద్ర మధ్యంలో సృష్టికర్త ఒక మహా బిలాన్ని ఏర్పాటు చేశాడనీ, దానిని అనుకునే ఒక కొండ ఉంటుందనీ, ఆ బిలం పేరే 'సింహం నోరు' అనీ, నూరు మైళ్ళ దూరంలో ఉన్న ప్రతి పడవనీ అది తన కేసి బలంగా లాగుతుందనీ, 'సింహం నోరు'కు అందిన నౌక



కొండను తాకి, మునిగి పోవటమే తప్ప మళ్ళీ తేలటం ఉండదనీ ఆయన చెప్పాడు. మనం ఇప్పుడు దానికే చిక్కినట్లున్నది.''

తమ నౌక వాయువేగంతో కొండను సమీపిస్తూ ఉండడం చూసి ఓడలోని వాళ్ళు భయభ్రాంతులయారు. త్వరలోనే అది సుడిగుండాన్ని చేరుకున్నది. ఆ సుడిగుండంలో ఎన్నివేల నౌకలు భగ్నమయాయో! అవన్నీ సుడిగుండంలో పడి గుండ్రగా తిరుగుతున్నాయి.

ఓడలోని వారంతా అబుల్ ఫవారిస్ చుట్టూ మూగి, ''ఏం చెయ్యమంటారు? దయచేసి చెప్పండి,'' అని వేడుకున్నారు.

''ఓడలో ఉన్న మోకులన్నీ తీసుకురండి. నేను సుడిగుండం కుండా ఈదుకుంటూ కొండ వద్దకు వెళ్ళి, ఓడను ఒడ్డున పెద్ద చెట్టుకు కట్టేస్తాను,'' అన్నాడు అబుల్ ఫవారిస్.

అతను సముద్రంలోకి దూకి ఈదుతూ పోయాడు. అదృష్టవశాన ప్రవాహం అతన్ని తీరాని కేసి తోసింది. అతను ఓడను తీరాన గల ఒక పెద్ద చెట్టుకు కట్టేశాడు.

తరవాత అతను తినేటందుకు ఏమైనా దొరుకుతుందేమోనని వెతుకుతూ కొండ ఎక్కాడు. ఎందుచేతనంటే, కొంత కాలంగా అతనికీ, ఓడలో ఉన్న అతని అనుచరులకూ తిండి లేదు.

కొండ పైకి చేరేసరికి అతనికి ఒక అందమైన, విశాలమైన మైదానం కనిపించింది. ఆ మైదానం మధ్యలో ఆకుపచ్చ రాతితో నిర్మించిన ఒక తోరణం ఉన్నది. అతను దాన్ని సమీపించి, అక్కడ ఒక ఉక్కు స్తంభాన్ని చూశాడు. దానికొక నగారా కట్టి ఉన్నది. తోరణం నుంచి ఒక రాగి పలక వేళ్ళాడుతున్నది. దానిమీద ఇలా రాసి వున్నది: ''పూర్వం అలెగ్జాండరు ఈ ప్రాంతానికి వచ్చి, 'సింహం నోరు' వల్ల గల ప్రమాదాన్ని గ్రహించి, తన వెంట ఉన్న మేధావు

లతో సంప్రతించి ఈ నగారా ఏర్పాటు చేయించాడు. ఈ నగారాను మూడుసార్లు కొట్టినట్టయితే, సుడిగుండంలో చిక్కుకున్న నౌక ఏదైనాసరే వెంటనే బయట పడుతుంది.''

ఈ మాటలు చదువుకుని అబుల్ ఫవారిస్, వెంటనే కొండ దిగి వెళ్ళి, తన అనుచరులతో ఈ సంగతి చెప్పాడు.

తరవాత కొంత చర్చ జరిగింది. నగారా వాయించిన వ్యక్తి, కొండ దిగివచ్చి, సుడి గుండం నుంచి దూరంగా వెళ్ళిపోయిన ఓడలో ఎక్కటం సాధ్యంకాదు.

''ఓడను కాపాడటం ముఖ్యం. నేను నగారా వద్దకు తిరిగివెళ్ళి దాన్ని మూడు సార్లు కొడతాను. ఓడతోబాటు మీరందరూ ప్రాణాలు దక్కించుకోండి. నేను ఈ దీవిలో దిగబడిపోతాను. గత్యంతరం లేదు. నేనీ త్యాగం చేస్తున్నందుకు మీరు నాకొక ప్రత్యుపకారం చెయ్యండి—నౌకలో ఉన్న సరుకులో సగం, బస్రాలో ఉన్న నా భార్యకూ, కొడుకులకూ ఇవ్వండి. నా గతి ఏమైతే అదవుతుంది,'' అన్నాడు అబుల్‌ఫవారిస్ తన అనుచరులతో.

అలాగే చేస్తామని ఓడలో వాళ్ళందరూ ప్రమాణాలు చేశారు. అబుల్‌ఫవారిస్



తోరణం వద్దకు తిరిగివచ్చి, ఒక కర్రతో నగారాను మూడుసార్లు కొట్టాడు. దాని ధ్వని చుట్టుపక్కల కొండల నుంచి గొప్పగా ప్రతిధ్వనించింది. ఈ ప్రతిధ్వను లింకా ఆగకుండానే, సుడిగుండంలో ఉన్న నౌక, ఎక్కుపెట్టి విడిచిన బాణంలాగా సముద్రం మీదికి వెళ్ళిపోయింది. ఓడలోని వారంతా గట్టిగా అరిచి, అబుల్‌ఫవారిస్‌కు వీడ్కోలు చెప్పారు.

కాలక్రమాన ఆ ఓడ బస్రా చేరింది. అందులోని నావికులు ఓడలోని సొత్తులో సగం అబుల్‌ఫవారిస్ భార్యకూ, బిడ్డలకూ అందజేశారు. అబుల్‌ఫవారిస్ కుటుంబం

తమ కుటుంబపెద్ద తమ కికలేనట్టుగానే భావించి శోకాలు పెట్టారు.

అక్కడ దీవిలో అబుల్ ఫవారిస్ ఆ రాత్రి తోరణం కింద పడుకుని నిద్రపోయి, మర్నాడు లేచి, తానింకా ప్రాణాలతో ఉన్నందుకు భగవంతుడికి ధన్యవాదాలు చెప్పుకుని, మైదానం మీదుగా నడవసాగాడు. మైదానం మధ్యలో నల్లటి పొగ పైకి లేస్తూ ఉండటం అతనికి కనబడింది. మైదానంలో అనేక వాగులు పారుతున్నాయి. అతను తొమ్మిది వాగులను దాటాడు.

అతను ఆకలితోనూ, అలసటతోనూ చచ్చిపోవటం తప్పనిసరి అనుకుంటూండగా కొంతదూరాన గొర్రెలు మేస్తూ కనిపించాయి. వాటిని చూడగానే అతనికి ప్రాణాలు లేచి వచ్చాయి. దగ్గిరలో మనుషులున్నారన్న మాట!

అతను గొర్రెలున్న దిక్కుగా నడుస్తూ ఒక వింత ప్రాణిని చూశాడు. ఆ ప్రాణి ఒక దీర్ఘకాయుడైన యువకుడు. అతని ఒంటి మీద చిరిగిపోయిన ఎర్రటి కంబళీ లాటిది ఉన్నది. అతని తలకూ, ఒంటికీ కవచం ఉన్నది. అబుల్ ఫవారిస్ ఆ యువకుణ్ణి పలకరించాడు.

ఆ యువకుడు అతన్ని ఎదురు పరామర్శించి, "ఎక్కడి నుంచి వస్తున్నావు?" అని అడిగాడు.

అబుల్ ఫవారిస్ తానొక అభాగ్యుణ్ణని తెలిపి, తనకు కలిగిన కష్టాలన్నీ ఆ యువకుడికి చెప్పుకున్నాడు.

దీర్ఘకాయుడైన ఆ యువకుడు నవ్వి, "నువు అభాగ్యుడివి కావు, అదృష్టవంతుడివే. అందుకే సింహం నోరు నుంచి తప్పించుకున్నావు. ఇక నీకే భయమూ లేదు. నిన్నొక గ్రామం చేర్చుతాను," అంటూ అబుల్ ఫవారిస్‌కు రొట్టెలూ, పాలూ ఇచ్చి, భోజనం చెయ్యమన్నాడు.

—(ఇంకా వుంది)





# బస్రా నావికుడు

## 3

అబుల్‌ఫవారిస్ దీర్ఘకాయు డిచ్చిన ఆహారంతో తన ఆకలి తీర్చుకున్నాడు.

"ఇక్కడ ఎంతసేపని ఉంటావు? మా యింటికి వచ్చి కాస్సేపు విశ్రమించు," అంటూ ఆ దీర్ఘకాయుడు అబుల్‌ఫవారిస్‌ను వెంటబెట్టుకుని కొండ దిగాడు. అక్కడ ఒక ద్వారం ఉన్నది. దానికి అడ్డంగా ఒక కొండరాయి పెట్టి ఉన్నది. ఆ దీర్ఘకాయుడు ఆ రాయిలో ఉన్న ఒక కంతలో చెయ్యి దూర్చి ఎత్తి పక్కన పెట్టి, అబుల్‌ఫవారిస్‌ను లోపలికి పోనిచ్చాడు. అబుల్‌ఫవారిస్ ద్వారంలోకుండా లోపల ప్రవేశించగానే దీర్ఘకాయుడు ద్వారాన్ని తిరిగి రాతితో మూసి, తన పని మీద తాను వెళ్ళిపోయాడు.

అబుల్‌ఫవారిస్ ద్వారం దాటి ఒక అందమైన తోట ప్రవేశించాడు. దాని నిండా పళ్ల చెట్లున్నాయి. ఆ తోట మధ్య ఒక ఇల్లున్నది. దాని చుట్టుపక్కల చాలా గుడిసెలు కనిపించాయి.

అతను ఒక గుడిసెలో ప్రవేశించాడు. అక్కడ పదిమంది మనుషులున్నారు. వాళ్ళందరూ మోకాళ్ళ మీద తలలు వాల్చి ఏడుస్తున్నారు. వాళ్ళు తల లెత్తి చూసి, "ఎవరు నువు?" అని అడిగారు.

తనకు దీర్ఘకాయుడు ఆతిథ్య మిచ్చాడని అబుల్‌ఫవారిస్ వాళ్లతో అన్నాడు.

"నువు కూడా ఈ రాక్షసుడి చేతుల్లో చిక్కుకున్నావా? వాడు గొర్రెలకాపరి వేషంలో తిరుగుతూ మనుషులను పట్టుకుని తింటూ ఉంటాడు," అన్నారు వాళ్ళు.

అదే సమయంలో దీర్ఘకాయుడు ద్వారానికి అడ్డం పెట్టిన రాయి తొలగించి, తన గొర్రెలను తోటలోకి తోలి, మళ్ళీ ద్వారం మూసి, తన ఇంట ప్రవేశించాడు.





అందరి భోజనాలూ అయాక ఆ దీర్ఘ కాయుడు ఆ మనుషులలో ఒకణ్ణి చంపి తిని, సారా తాగి, పడుకుని నిద్రపోయాడు.

అబుల్‌ఫవారిస్ మిగిలిన వాళ్ళతో, "ఎలాగూ చావు తప్పదు. గనక నేనే వీణ్ణి చంపుతాను. మీరు కాస్త సహాయపడండి," అన్నాడు. కాని వాళ్ళు చెయ్యీ, కాలూ కదిపే స్థితిలో కూడా లేరు. అందుచేత అబుల్‌ఫవారిస్ తానే నిప్పులో నుంచి రెండు కట్టెలను తీసి, వాటితో దీర్ఘకాయుడి కళ్లు రెండూ పొడిచేశాడు.

ఆ బాధతో ఆ రాక్షసుడు లేచి నిలబడి తన కళ్లు పొడిచిన వాడి కోసం తడవ సాగాడు. అబుల్‌ఫవారిస్ సులువుగా, వాడికి అందకుండా తప్పించుకున్నాడు. దీర్ఘ కాయుడికి ఎంతసేపూ తన గొర్రెలే తగి లాయి. వాడు ద్వారానికి అడ్డం ఉన్న రాయి తీసేసి గొర్రెలను బయటికి తరిమాడు. అబుల్‌ఫవారిస్ అక్కడ ఉన్న గొర్రెచర్మం ఒకటి మీద వేసుకుని గొర్రెలతోబాటు బయ టికి పారిపోవటానికి ప్రయత్నించాడు, కాని బయటికి పోయే గొర్రెల వీపులు తడువు తున్న దీర్ఘకాయుడు కనిపెట్టేశాడు. ఐతే అబుల్‌ఫవారిస్ తాను కప్పుకున్న గొర్రె తోలు రాక్షసుడి చేతిలో వదిలేసి, తాను సముద్రం కేసి పరుగుతీశాడు.

దీర్ఘకాయుడు అబుల్‌ఫవారిస్‌ను వెంబ డించి, నీటి దాకా వచ్చి ఆగిపోయాడు. వాడికి ఈత రాదు. అబుల్‌ఫవారిస్ ప్రాణాలు అరచేత పట్టుకుని ఈదుతూ కొండ అవతలి పక్క చేరుకున్నాడు. అక్కడ ఒక ముసలివాడు కనిపించి, అబుల్ ఫవారిస్ వృత్తాంత మంతా విని అతన్ని తన ఇంటికి తీసుకుపోయాడు.

ఈ మనిషి కూడా నరభక్షకుడేనని తెలియగానే అబుల్‌ఫవారిస్ హతాశు డయాడు. అయితే అతను ఆ ముసలివాడి భార్యను మంచి చేసుకుని, ఆమెకు ఇంటి



పనులలో సహాయపడటానికి ఒప్పుకున్నాడు. ముసలివాడు అతన్ని గొర్రెలు కాసే పనికి నియోగించాడు. అందుకోసం అతన్ని గొర్రెల కాపరి ఉండే చోటికి పంపారు.

ఒకనాడు అతను చెట్ల మధ్య తిరుగుతూ ఒక చెట్టు తొర్రలో పెద్ద తేనెపట్టు చూశాడు. ఆ రాత్రి అతను ఆ తేనెపట్టు గురించి గొర్రెలకాపరి భార్యతో చెప్పాడు. అమె మర్నాడు ఉదయం, తేనె తీసుకు రమ్మని అబుల్ ఫవారిస్ వెంట గొర్రెలకాపరిని పంపింది. దారిలో అబుల్ ఫవారిస్ ఆకస్మికంగా గొర్రెలకాపరి మీద పడి, వాణ్ణి ఒక చెట్టుకు కట్టేసి, తప్పించుకు పోవటానికి సముద్రంలోకి దూకి ఈదనారంభించాడు.

అతను చాలా గంటలపాటు ఈదిన మీదట అతని కొక ఓడ తగిలింది. ఓడలో వాళ్ళు అతన్ని చూసి, ఓడను అతని వేపు నడిపించి, అతన్ని ఎక్కించుకున్నారు. వాళ్ళకు అతను తన కథ అంతా ఉన్నది ఉన్నట్టు చెప్పాడు.

అదృష్టవశాన ఆ ఓడ తిన్నగా బస్రాకే పోతున్నది. అబుల్ ఫవారిస్ ఒక నెలకు ఇల్లు చేరుకుని, తన వాళ్ళను తిరిగి కలుసుకున్నాడు. అప్పటికి అతని తల పూర్తిగా నెరిసిపోయింది.



అతను కొంత కాలం ఇల్లు కదలకుండా విశ్రాంతి తీసుకుని, ఒకనాటి ఉదయం సముద్రతీరాన షికార్లు చేస్తూండగా, మొదట తన ఓడను కిరాయికి తీసుకున్న ముసలివాడే కనిపించాడు.

వాడు అబుల్ ఫవారిస్‌ను గుర్తించక, "నీ ఓడను ఆరుమాసాల పాటు కిరాయికిస్తావా?" అని అడిగాడు. వెనక అడిగినట్టే అబుల్ ఫవారిస్ వెయ్యి బంగారు దీనారాలు అడిగాడు. ముసలివాడు డబ్బు చెల్లించి, మర్నాడు వస్తానని వెళ్ళిపోయాడు.

మర్నాడు అబుల్ ఫవారిస్ తన ఓడలో ముసలివాణ్ణీ, వాడి నౌకరునూ, సంచీలనూ

ఎక్కించుకుని ప్రయాణమయాడు. మూడు నెలలు సముద్రయానం చేసి వాళ్ళు ముత్యాలుండే దీవిని చేరారు; ఓడను సముద్ర తీరాన ఉంచి, సంచీలతో సహా కొండపైకి ఎక్కారు.

వెనకటి లాగే ముసలివాడు అబుల్ ఫవారిస్‌ను గోతులలోకి దిగి ముత్యపు చిప్పలు తోడమన్నాడు.

"నాకు దిగటానికి భయంగా ఉంది," అన్నాడు ఫవారిస్.

"అపాయం ఉంటే నిన్ను దిగమంటానా? ఏమీ భయం లేదు. దిగు!" అన్నాడు ముసలివాడు.

అబుల్ ఫవారిస్ మొండికెత్తాడు.

తప్పేది లేక ముసలివాడు ఒక గోతిలోకి తానే దిగి, తట్టలో ముత్యపుచిప్పలు పైకి పంపుతూ, "చూశావా? ఏమీ అపాయం లేదు! నన్ను పైకి లాగు. ముసలివాణ్ణి. ఒంట్లో శక్తిలేదు," అన్నాడు.

"దిగనే దిగావు గనక, ఈ రోజుకు నువే పనిచెయ్యి. రేపు నేను దిగి ఓడ నిండేటట్టు ముత్యపుచిప్పలు తీస్తాను," అన్నాడు అబుల్ ఫవారిస్ ముసలివాడితో.

ముసలివాడు చాలా సేపు ముత్యపు చిప్పలు పైకి పంపి, "బాబూ, ఇక నా వల్ల కాదు. అలసిపోయాను," అన్నాడు.

"ఇప్పుడు నీకు తెలిసివచ్చిందా, ముసలి పీనుగా! ఒకనాడు నన్ను ఇదే స్థితిలో ఇక్కడి గుంటల్లో వదిలిపోయావు. నా పేరు అబుల్ ఫవారిస్. ఎందరినో ఇలా చంపావు. దేవుడి దయవల్ల నేను బతికి బయటపడ్డాను. నీ మూలంగా చచ్చిన వారందరినీ గుర్తు తెచ్చుకో," అని అబుల్ ఫవారిస్, ముసలి వాడున్న గోతి మీద ఒక పెద్ద రాయి కప్పి, నౌకరు చేత ముత్యపుచిప్పలు మోయించి తెచ్చి, తన ఓడలో వేయించి, ఇంటికి తిరిగి వచ్చి, నావికుడి జీవితం మానేసి, సుఖంగా జీవించాడు. —(అయిపోయింది)

